## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120002288

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వినుర వేమ

## వేమన పద్యాల నీతి కథలు

ఏడిద కామేశ్వరరావు



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

హైదరాబాద్.

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషి చేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవి రెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తునాము.

**శారదా అశోకవర్ధన్**
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి
జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

# ఇందులో

# చిత్తశుద్ధి

శ్రీరామచంద్రుని ఆజ్ఞతో హనుమంతుడు దక్షిణ సముద్రం దాటి, రావణుని లంకలో ప్రవేశించాడు. సీతాదేవిని చూసి, ఆమెతో మాటలాడి, తిరిగి వచ్చి, ఆ వివరాలన్నిటినీ, శ్రీరామునికి తెలియజేశాడు. శ్రీరాముడు లంకకు వెళ్లి, రావణుని సంహరించి, సీతను తీసుకొని రావాలని నిశ్చయించాడు. వెంటనే రాముడు, లక్ష్మణుడు, ఆంజనేయుడు, సుగ్రీవుడు, జాంబవంతుడు మొదలైన వానర సైనికులు అందరూ భారతదేశం దక్షిణ కొనకు చేరు కున్నారు.

అక్కడ సముద్రాన్ని దాటి లంకకు ఉత్తరప్రాంతంలో కాలు పెట్టవలసి ఉంది. అయితే ఆ మహా సాగరాన్ని దాటడం ఎలాగ? హనుమంతునిలాగ అందరూ ఆకాశంలో ఎగిరి, లంకలో వాలలేరు కదా! అందువల్ల ఆ సముద్రానికి అడ్డంగా వంతెన వంటి వారధిని కట్టి, లంకలో ప్రవేశించాలను కున్నారు. వానర సైనికు లందరూ సిద్ధమైనారు.

కొండలు, పర్వతాలు, చెట్లు చేమలు - అన్నీ తీసికొని వచ్చి సముద్రంలో పడవేయడం మొదలు పెట్టారు. వారధిని కట్టే పని



ఎంతో వేగంగా జరుగుతూ ఉంది. ఆ సముద్రం ఒడ్డున కూర్చున్న ఒక ఉడుత వానరులు చేస్తున్న పనిని చూసింది. దానికి ఒక ఆలోచన తట్టింది! "వారధిని కట్టిన తరువాత, ఆ రాళ్ళపైన నడుస్తూ వెడితే, శ్రీరాముని సుకుమారమైన పాదాలు నొప్పి పెడతాయి. దారి మెత్తగా ఉండడం కోసం కొంత ఇసుక చల్లడం చాలా అవసరం" అని అనుకొన్నది ఆ ఉడుత.

వెంటనే సముద్రం నీటిలో తన వొళ్ళంతా తడుపుకొని, ఇసుకలో దొర్లి, ఆ ఇసుకను ఆ వారధి మీద చల్లడం మొదలు పెట్టింది! ఇలా ఎంతో సేపటి నుంచి ఆ ఉడుత చేస్తున్న పనిని శ్రీరాముడు చూశాడు. ఆయనకు ఎంతో ఆశ్చర్యం, ఆనందం కలిగాయి. బుడుత అంత ఉన్న ఆ ఉడుత తెచ్చే ఇసుక ఎంత ఉంటుంది! చిటికెడు కూడా ఉండదు. రవంత రవంతగా ఇసుక పోస్తూ ఉంటే, అంత పెద్ద వారధి ఇసుకతో నిండడానికి ఎన్ని ఏళ్ళు పడుతుంది!– ఇలా అనుకొన్న శ్రీరామునికి – ఎంతో ముచ్చట కలిగింది! తనకు చేతనైనంత.... ఎంతో కొంత...సహాయం చేయాలనే ఆశతో చేస్తున్న ఆ ఉడుత భక్తికి రాముడు ముగ్ధుడైనాడు. వెంటనే ఆ ఉడుతను చేతులలోకి తీసికొని ఆప్యాయంగా దాని వొళ్ళు నిమిరాడు. దాని వీపు మీద రాముని వేళ్ళ చారలు పడ్డాయి. ఆ చారలు ఉడుతలకు రామవరప్రసాదంగా ఈనాటికీ ఉన్నాయంటారు.

ఉడుత, నిర్మలమైన మనస్సుతో, భక్తినిండిన హృదయంతో చేసిన పని కొంచెమైనా, ఆ పని వెనుక ఉన్న దాని 'రామభక్తి' కొండంత! అందుకే శ్రీరామచంద్రుడు దానిని ప్రేమతో చేరదీశాడు!–

ఇటువంటి విషయాన్నే – వేమనయోగి చక్కగా చెప్పాడు ఓ పద్యంలో . . .!

చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు కొదువ కాదు –
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత!
విశ్వదాభిరామ వినురవేమ ॥

# ప్రాణంపోకడ

సీతానగరంలో సీతయ్య అనే వ్యాపారి ఉండేవాడు. అతడు మహా చాదస్తుడు. జ్యోతిషం అంటే అతనికి ఎంతో నమ్మకం. వారాలు వర్జాలు, శకునాలు చూసుకోకుండా ఏ పనీ చేసేవాడు కాదు.

ఒకనాడు ఓ బైరాగి అతని కంటపడ్డాడు. వెంటనే ఆ బైరాగిని ఇంటికి తీసికొని వచ్చి, కడుపు నిండా అతనికి భోజనం పెట్టి, సీతయ్య తన జాతకం బైరాగి చేతికిచ్చి, భావి జీవిత ఫలితాలు చెప్పమన్నాడు. ఆ బైరాగి ఆ జాతక పత్రాలను అటు త్రిప్పి, ఇటు త్రిప్పి, వేళ్లు మడిచి లెక్కలు కట్టి, అప్పటికి రెండేళ్ల తరువాత - ఫలానా నెలలో, ఫలానా తేదీని, మధ్యాహ్నం, రెండు గంటలకు మరణం ఉన్నదని చెప్పాడు.

సీతయ్య గుండె గుభేల్ మన్నది. బెంగతో కృశించి పోయాడు. అయితే కొన్ని రోజులకు ఆ బెంగ దిగమింగి, ఇక బతికి ఉన్న రోజుల్లో క్షేత్రాలు తిరిగి, దైవపూజలు చేసికొంటే పాప విముక్తి



కలుగుతుందని అనుకొన్నాడు. వెంటనే వ్యాపారం కట్టిపెట్టేశాడు. ఉన్న కొంచెం పొలం అమ్మి వేశాడు. ఆ డబ్బు చేత పట్టుకొని, భార్యను వెంట పెట్టుకొని దేశాటనకు బెలుదేరాడు సీతయ్య.

అలా తిరిగి తిరిగి చావు రోజు ఇక ఓ వారం ఉందనగా ఇంటికి చేరుకొన్నాడు. సీతయ్య చేసే పనులన్నీ చాదస్తపు పనులనీ, తెలివి తక్కువ పనులనీ మొదటినుంచీ చెబుతూ ఉన్న పినతండ్రి పేరయ్య, సీతయ్య ఇంటికి వచ్చాక అతణ్ణి కనిపెట్టుకొనే ఉన్నాడు.

అది సీతయ్య చనిపోవలసిన రోజు! రావలసిన రోజు రానే వచ్చిందని సీతయ్య, శుభ్రంగా భోజనం చేసి, చావిడిలో - భగవధ్యానం చేస్తూ కూర్చున్నాడు . . . . అంతలో . . . అనుకొన్న - ఆ రెండు గంటల సమయం వచ్చేసింది ! రావడమేకాదు , గబగబా గంటలను దొర్లించేసింది కాలం ! సీతయ్య కళ్ళు తెరిచి, చూసేసరికి సాయంత్రం దీపాలు పెట్టారు ! అందరికేసీ తెల్లబోయి చూస్తూ సీతయ్య గుడ్ల నీరు కక్కు కున్నాడు !

అది చూసి, పేరయ్య అతణ్ణి ఓదార్చాడు "జ్యోతిషాన్ని గుడ్డిగా నమ్మకూడదు. శాస్త్రం గొప్పదే! కాని, ఆ శాస్త్రాన్ని అన్వయించి చెప్పేవారి శక్తిలోపం వల్ల, వారు చెప్పేవి జరుగకుండా పోతున్నాయి. ఈ విషయం నీకు ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకొన్నావు కాదు. ఉన్న పొలం కాస్తా అమ్ముకొని, తిరిగి తిరిగి బికారిగా ఇంటికి చేరావు. సరేలే ! అయిన దేదో అయిపోయింది. మా ఇంటికి పోదాం పద... తరువాతి విషయం తరువాత చూసుకొందాం. మన పెద్దలు ఊరికే చెప్పారా వానరాకడ, ప్రాణం పోకడ తెలియవని! అంతా మూర్ఖంగా ప్రవర్తించావు" - అంటూ సీతయ్యను, అతని భార్యను తన ఇంటికి తీసుకొని వెళ్లాడు !

ఇలాంటి విషయాన్నే - వేమన యోగి ఓ పద్యంలో చక్కగా చెప్పాడు.

వానరాకడయును, ప్రాణంబు పోకడ
కానబడదెంత ఘనునికైన -
కానబడిన మీద కలి ఏట్లు నడుచురా
విశ్వదాభిరామ వినుర వేమ ॥

# అనగననగ రాగం

మహారాష్ట్ర ప్రాంతంలో అదొక చిన్న పల్లెటూరు. ఆ ఊరిలో "దంతాలే" వారి కుటుంబం అంటే ఎంతో గౌరవం. దంతాలే మంచి భక్తుడు. పదిమందిని చేర్చి, ఎప్పుడూ భజనలు చేస్తూ ఉండేవాడు. అందువల్ల ఆయన ఇంటిలో సంగీతం ఎప్పుడూ తాండవ మాడుతూ ఉండేది.

దంతాలేకు ఒక కొడుకు. చాలా చురుకైన వాడు. ఇంటిలో సాగుతూ ఉన్న సంగీతాలను పట్టుకొని, అస్తమానమూ కూని రాగాలు తీస్తూ ఉండేవాడు –"చదువుకోమంటే సంగీతాలు తీస్తూ కూర్చుంటా వేమిటిరా?" అని తల్లిగాని, తండ్రిగాని అంటే తన వాచకంలోని పద్యాలకు, రాగ, తాళ వరసలలో పాడుతూ కూర్చొనేవాడు. బడిలో ఉండగా – ఆ వీధిలో ఎవరైనా ఒక దాసరి తంబురా మీటుతూ పాడుకొంటూ పోతూ ఉంటే, బడిలోంచి బైటకు వచ్చి, ఆ దాసరి వెంట పడి, అతడు పాడే పాటలను పాడుతూ పరుగులు పెట్టేవాడు. ఇలాగ, ఎక్కడ సంగీతం వినపడితే అక్కడకు చేరి, ఆ పాటలు పాడుతూ ఉండడం ఆ అబ్బాయికి అలవాటు అయిపోయింది. కొడుకు చేత ఆ అలవాటు మానిపించాలని, దంతాలే ఎన్నో ప్రయత్నాలు చేశాడు. అయినా లాభం లేకపోయింది!



ఇలా ఉండగా ఓ రోజున ఆ ఊరిలో ఓ వీధి నాటకం జట్టువారు "కుశలవ" నాటకం ప్రదర్శించారు. ఆ కుర్రవాడు తెల్లవార్లూ ఆ నాటకం చూసి, తన ఈడువారైన బాలురు కుశలవులుగా నటిస్తూ పాడిన పాటలు విని పొంగిపోయాడు. తెల్లవారిన తరువాత ఆ నాటకదళం వారు పొరుగూరికి పోతూఉంటే వారితో కలిసి తానూ వెళ్ళిపోయాడు. కొడుకు కనపడకపోవడంతో తల్లి తండ్రులు కంగారు పడ్డారు. ఊరిలోను, పొరుగు ఊళ్ళల్లోను వెతికారు. చివరకు పక్క ఊళ్ళో, రాత్రి నాటకం ఆడిన చోట, దేవాలయం అరుగు మీద నిద్రపోతూ ఉన్న కొడుకును, అతడు నిద్రలో నాటకం పాటలను పలవరిస్తూ ఉండటం చూసి – తండ్రి "బాబుకు చదువు మీద ఆసక్తిలేదు . సంగీతం అయినా నేర్పిస్తే బాగుపడతాడేమో" అను కొన్నాడు. వెంటనే కొడుకును ఓ సంగీత విద్వాంసుని వద్ద చేర్చాడు !

గురువు చెప్పిన పాఠాన్ని , షష్టి ఘడియలూ పాడుతూ ఉండడం వల్ల – ఆ పాఠం గురువు చెప్పినదానికంటే చవులూరుతూ మిన్నగా ఉండడం చూసి, అందరూ ఆశ్చర్యపోయేవారు!

ఈ విధంగా నిరంతర సంగీత సాధనలో – ఇరవై ఏళ్లు వచ్చే సరికి ఆ అబ్బాయి – జానపద సంగీతకళలో – ఎంతో సమర్థుడైనాడు. పండితలోకం తక్కువభావంతో చూసే జానపద సంగీతకళకు సభాగౌరవాన్ని కలిగించాడు. మహారాష్ట్రంలో ప్రసిద్ధమైన "లావణి" సంగీత నృత్య ప్రదర్శనలలో అద్వితీయుడుగా పేరుపొందాడు. అతని కళా నైపుణ్యానికి పౌర సంస్థలు అతన్ని ఘనంగా సన్మానించాయి.

కేవలం కళమీద – తెలిసో తెలియకో, ఏర్పడిన మమకారం ఆ అబ్బాయి నిత్య సాధనలో వన్నెకెక్కింది. వాసి గూర్చింది. అతడే పేరు గాంచిన తుల్జా దంతాలే !

ఇలాంటి విషయాన్నే యోగి వేమన చక్కగా చెప్పాడు ఓ పద్యంలో. . .

అనగననగరాగ మతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ॥

# స్థాన బలిమి

మంగయ్యగారి మామిడితోట అంటే ఆ ఊళ్ళో అందరికీ ముచ్చటే. ఆ తోట కేవలం మామిడి తోటే కాదు, ఆ తోటలో జామి, పనస, సపోటా మొదలైన ఫలవృక్షాలతో పాటుగా - తోట చుట్టూ కొబ్బరి, తాడిచెట్లు కూడా ఉన్నాయి. అందుకనే ఆ దారిన వెళ్లే వారందరికీ - "తోటలో కొంచెం సేపు కూర్చుంటే బాగుండును" అనిపిస్తూ ఉంటుంది. మంగయ్య ఆ తోట ఎంతో సరదాగా పెంచుతూ, ప్రాణప్రదంగా కాపాడుతూ ఉంటాడు అంతే కాదు, రాళ్ళు విసిరి చెట్లను పాడు చేస్తారని మంగయ్య, అటు వెళ్లే వారిని, ఇటు వెళ్లే వారిని ఓ కంట కనిపెడుతూనే ఉంటాడు.

అయినా, ఓ నాడు రంగడు అనే పిల్లవాడు ఓ చేతికర్రతో మామిడి చెట్టు కాయలు కోస్తూ మంగయ్య కంటపడ్డాడు. మంగయ్య గబగబా పరుగెత్తుకొంటూ వచ్చి, రంగడి చేతిలోని కర్రను ఊడలాగుకొని, కాయలు కోసినందుకు మండి పడ్డాడు. రంగడు హడలిపోయాడు. భయంతో వొణుకుతూ మంగయ్యకు దండాలు పెట్టాడు.



తప్పుచేసినందుకు క్షమించమని, మంగయ్య కాళ్లావేళ్లా పడ్డాడు. కోపం తగ్గించుకొని - మంగయ్య -"ఇక ముందు ఇలా దొంగపనులు చేశావంటే ఊరుకోను - కాళ్లు, చేతులు వరగ గొడతాను - జాగ్రత్త" - అంటూ హెచ్చరించాడు. రంగడు సరేనంటూ, ఓరగా కొర కొర చూపులు చూసుకొంటూ, ఇంటికేసి పరుగెత్తాడు.

"ఆ మరునాడు, రంగడు ఉండే వీధిలో, మంగయ్య వెడుతూ ఉన్నాడు. చటుక్కున వీపుమీద రాయి తగిలితే అతడు, వెను దిరిగి చూశాడు. రంగడు తన ఇంటి గుమ్మంలో నిలబడి, చేతికర్ర ఊపుతూ" నిన్న కొట్టడానికి కర్ర ఎత్తావే ! ఇప్పుడు కొట్టు చూస్తాను. ఇలా వచ్చావంటే, ఈ కర్రతోనే బాదేస్తాను" అంటూ మంగయ్య మీదికి ఎగిరిపడ్డాడు.

మంగయ్య మెల్లిగా వచ్చి, రంగడి ఇంటిముందు నిలబడ్డాడు. అంతలో, రంగడి తండ్రి బైటకు వచ్చాడు."ఏమిటేమిటి?" అంటూ రంగడు 'నన్ను కొడతాడట' అంటూ మంగయ్యను చూపించాడు."అది సరే - నిన్ను ఎందుకు కొట్టబోయానో కూడా చెప్పు, మీనాన్నతో" అన్నాడు మంగయ్య. రంగడు ఏమేమో చెప్పబోతూ ఉంటే, రంగని తండ్రి కలుగజేసుకొని, మంగయ్యను బ్రతిమిలాడాడు! చిన్నవాని తప్పుకాయమని' ! మంగయ్య అతని మాటను మన్నించి - "నిన్న తోటదగ్గిర కాళ్లా వేళ్లా పడ్డాడు. ఇవాళ, ఇక్కడ, రేచుకుక్కలాగ ఎగిసెగిసి పడుతున్నాడు - చిత్రంగా ఉంది" - అంటూ నవ్వేశాడు! దానికి రంగని తండ్రి నవ్వుతూ - "ఇది ఇల్లుకదా! పైగానేనిక్కడ ఉన్నానాయె ! స్థాన బలం బాబూ - బురదపాము కూడా తల ఎత్తి బుస కొడుతుంది -" అన్నాడు. అక్కడ చేరిన నలుగురూ పకపకా నవ్వేశారు! అందుకే వేమన యోగి ఇలాంటి వారిని ఇలా అన్నాడు.

నీళ్లలోన మొసలి నిగిడి ఏనుగుదీయు
బయటకుక్కచేత భంగపడును -
స్థాన బలిమి గాని తన బలిమి కాదయా
విశ్వదాభిరామ వినురవేమ ॥

# ఎలుకతోలు

కనకరాజుగారు కొంచెం కలిగిన కుటుంబీకుడు. పట్నంలో అన్ని హంగులూ కలిగిన బంగళాకట్టుకొని, భార్యతో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. ఒకనాడు ఊరిబెట, వాహ్యాళికి వెళ్ళి వస్తూ ఉండగా - దారిలో, ఓ తోట గట్టుమీద, ఓ కోతి పిల్ల ఏడుస్తూ కనపడింది. ఆయనకు ఎంతో జాలి కలిగి, దానిని మెల్లిగా ఇంటికి తీసుకొని వచ్చాడు. జాగ్రత్తగా పెంచాడు. కొన్నాళ్లకు ఆ కోతి మంచి చురుకుగా తయారయింది. చిట్టి చిట్టి గంతులు వేస్తూ - ఆ కోతిపిల్ల - బల్లల మీద కుర్చీల మీద ఎగిరెగిరి దూకుతూ ఉంటే, కనకరాజుగారికి ఎంతో ఆనందమయ్యేది. పిల్లలు లేని తనకు, కాలక్షేపం కోసం ఈ కోతిపిల్ల దొరికిందేమోనని ఆయన ఎంతో సంతోష పడ్డారు.

ఇలా ఉండగా ఓ నాడు - "నరవానరకుంజరాలు జ్ఞానం కలవి" అనే పెద్ద సూక్తి గుర్తుకు వచ్చి, ఆ కోతిపిల్లకు అన్ని విధాలా శిక్షణ ఇప్పించాలని, ఆయన నిశ్చయించుకొన్నాడు. వెంటనే జంతువులకు తర్ఫీదు ఇవ్వడంలో నేర్పు ఉన్న జగ్గయ్యను పిలిపించి- కోతి పిల్లకు అన్ని విద్యలూ నేర్పించడానికి నియమించారు. జగ్గయ్య నేర్పు తీర్పులలో ఆ కోతి పిల్ల ఎన్నో విద్యలు నేర్చింది. కర్ర బుజాలపై వేసుకొని హుందాగా నడుస్తుంది. ఎవరైనా ఎదురుగా కూర్చుని పాట పాడితే తానుకూడా బాసింపీట వేసుకొని కూర్చొని చక్కగా తాళం



వేస్తుంది. తన లాగూ చొక్కా తానే తొడుక్కొంటుంది. తనకు తానే స్నానం చేస్తుంది. తన అన్నం తానే కలుపుకొని తింటుంది. ఇంటికి ఎవరైనా వస్తే - వారిని కూర్చోమని కుర్చీ చూపిస్తుంది. కనకరాజుగారికి ఆ విషయం చెపుతుంది. ఆయన చేయి పట్టుకొని వెనుక కాళ్ల మీద నడుస్తూ తానుకూడా బైటకు వస్తుంది.

ఇలా ఇంటిలో, చేతికంది వచ్చిన ఓ కుర్రవానిలా ఆ కోతిపిల్ల ప్రవర్తిస్తూ ఉంటే- కనకరాజుగారికి ముచ్చటగా వుండడమే కాదు -- ఊరి వారందరికీ కూడా వినోదంగా ఉండేది. "వానరుణ్ణి ఓ నరుడుగా మార్చారు" అంటూ కనకరాజు గారిని అందరూ అభినందిస్తూ ఉండేవారు.

"ఒకనాడు - ఊరిపెద్దలు, పొలిమేరలోని తోటలో" వనభోజనాలను ఏర్పాటుచేసి, కనకరాజుగారిని కూడా ఆహ్వానించారు. కనకరాజుగారు, కోతిని కూడా ముస్తాబుచేసి, వనభోజనాలకు తీసికొని వెళ్లారు. అక్కడ కనకరాజుగారి పక్కన ఓవిస్తరివేసి, కోతికి కూడా వడ్డించారు.

విస్తరి ముందు కూర్చున్న కోతి, ఆ వనమంతా కలయచూస్తూ తినడమే మరిచిపోయింది. అలా చూస్తూ చూస్తూ ఆ కోతి, చటుక్కున ఓ మామిడి చెట్టుపైకి ఎగిరి, గబగబా ఎగబ్రాకింది. చూస్తూ ఉండగా-- ఓ చెట్టుమీద నుంచి మరో చెట్టు మీదికి ఎగురుతూ చివరికంటూ దూసుకుపోయింది. మామిడి చెట్ల కొమ్మలు విరిచి కిందికి విసిరింది. కాయలు తెంపి కిందపడేసి నానా రభస చేసింది. కనకరాజుగారు దానిని ఎంత పిలిచినా అది రాకపోయే సరికి - "ముద్దినుసులూ పెట్టి ముచ్చటగా తర్ఫీదు చేస్తే - కోతి తన జాతి బుద్ధి పోనిచ్చుకొన్నదికాదు. ఎంత మెరుగు పెడితే ఏలాభం! ఇత్తడి ఇత్తడే, బంగారం బంగారమే! నరుడు నరుడే, వానరుడు వానరుడే . .." అనుకొంటూ విస్తుబోయారు!

అందుకే వేయనయోగి ఓ పద్యంలో చక్కగా అన్నాడు--

ఎలుకతోలు తెచ్చి ఏడాది ఉతికిన
నలుపు నలుపేగాని, తెలుపు గాదు-
కొయ్యబొమ్మ తెచ్చి కొట్టిన పలుకదు
విశ్వదాభిరామ వినురవేమ॥

# చిక్కియున్న వేళ

అదొక చిట్టడవి. ఆ అడవి పొలిమేరలో ఒక బలవంతమైన పాము తిరుగుతూ ఉండేది. ఆ దారినిపోయే వారిపై కస్సుబుస్సుమంటూ ఎగిరిపడి, కాటు వేస్తూ ఉండడం వల్ల కొందరు చచ్చిపోయారు కూడా! అందుచేత ఆ అడవి పొలిమేర అంటే ప్రజలు హడలిపోతూ ఉండేవారు.

ఇలా ఉండగా ఒకనాడు- ఆ అడవి దారి వెంట ఒక యోగి వెడుతూ ఉండడంచూసి - ఆ తాచుపాము బుసలు కొడుతూ అతణ్ణి సమీపించింది. దానిని చూసి, ఆశ్చర్యపోతూ యోగి అన్నాడు! "ఓ పామూ! నువ్వు నన్ను కరిచినా నాకు ఏమీ భయం లేదు! కాని, అసలే కాక రోగంతో బాధపడుతూ ఉన్న నువ్వు - ఇంకా రోగిష్టి దానివై చాలా కాలం బాధపడతావు సుమీ..."

యోగి మాటలకు పాము నివ్వెరపోయింది. తన జబ్బును తెలుసుకొని మాట్లాడిన పుంగవా! నేను నిజంగా కాకరోగంతో బాధపడుతున్నాను. నాకు ఈ రోగం తొలిగిపోయే దారి చూపి, నన్ను కాపాడు" అని వేడుకొన్నది. పాము స్థితి చూసి యోగికి



జాలివేసింది. వెంటనే "చూడు పామూ! నువ్వు ఈ దారిని పోయే వారి నందరినీ భయపెడుతూను, కరిచి చంపుతూను ఉండడంవల్ల నీకీ రోగం వచ్చింది. ఆ జబ్బు పోవాలంటే, నువ్వు ఎవరినీ ఏమీ అనకుండా, ఎవరికీ అపకారం చేయకుండా ఉండాలి. అదిగో ఆ చెట్టు మొదలు దగ్గర ఉండు. నేను మళ్లీ ఈ దారిని వచ్చినప్పుడు నీకు మంచి దారి చూపుతాను" అని చెప్పి ఆ యోగి వెళ్లిపోయాడు!

యోగి చెప్పినట్లుగా, ఆ పాము, చెట్టు మొదలు దగ్గర చుట్ట చుట్టుకొని పడుకొన్నది. కదలకుండా మెదలకుండా వెనుకటిలా కస్సుబుస్సుమనకుండా పడి ఉన్న ఆ పామును చూసి ఆ దారిని వెళ్లేవాళ్లు అబ్బురపడుతూ- దానిపై రాళ్లు విసరడం మొదలుపెట్టారు. ఆ రాళ్ల దెబ్బలకు గాయాలుపడినా, ఆ పాము వాళ్లను ఏమీ అనకుండా బాధతో మూలుగుతూ అలానే పడి ఉంది.

కొన్నాళ్లకు, ఆ యోగి అన్నమాట ప్రకారంగా ఆ దారిని వచ్చాడు. గాయాలతో బాధపడుతూ బక్కచిక్కి ఉన్న పామును పలకరించాడు. పాము జరిగినదంతా చెప్పింది. యోగికి జాలి కలిగింది. "ఓ వెర్రి పామూ! ఎవరికీ అకారణంగా అపకారం చేయవద్దని చెప్పానేగాని, రాళ్లతో దెబ్బలు కొట్టేవారిని చూసి ఊరుకోమన్నానా! నువ్వు అలా పడి ఉన్నందువల్ల, అందరూ నిన్ను లోకువ కట్టారు. చావు దెబ్బలు కొట్టారు. ఇది లోకరీతి! దెబ్బలు తగులుతూ ఉన్నప్పుడు నిన్ను నువ్వు రక్షించుకోవాలి. అందుచేత నిన్ను కొట్టే వాళ్లను బెదిరించి పారదోలాలి. అంతేకాని, కాటువేసి చంపరాదు. నువ్వు అలా నడుచుకుంటే నీ క్రూరత్వం తగ్గుతుంది. అప్పుడు నీకు జరిగే అపకారం తగ్గుతుంది. నువ్వు సుఖంగా బతుకుతావు. అంతేకాని, బలం ఉన్నా అవసరం వచ్చినప్పుడు దానిని ఉపయోగించుకొనకపోతే, చలిచీమలు కూడా నిన్ను చంపి వేస్తాయి- తెలిసిందా!" అంటూ ఆ యోగి వెళ్లిపోయాడు.

అందుకే వేమన యోగి అన్నాడు, ఓ పద్యంలో-

చిక్కియున్న వేళ సింహంబునెనను
బక్క కుక్క కరిచి బాధ చేయు
బలిమి లేని వేళ పంతంబు చెల్లదు
విశ్వదాభిరామ వినురవేమ!

# తొందరపాటు

ఆకాశం నిర్మలంగా ఉంది. పక్షులు కిలకిలమంటూ హాయిగా ఎగురుతున్నాయి. అస్తమయ సూర్యుని కిరణాలు సోకి, మబ్బు తునకలు రంగురంగు దుప్పట్లులా మెరిసిపోతున్నాయి!

కింద కొలనులో తిరుగాడుతున్న చేప పిల్లకు ఆకాశం అందం చూస్తూ ఉంటే, ఆనందం కెరటాలుగా పొంగి పొరలుతున్నది. నీటి అంచుపై తెర వద్ద కంటూ వచ్చింది. ఆ చేప పిల్ల రెక్కలాడించు కుంటూ అటూ ఇటూ కేరింతలు కొడుతూ పరుగులు పెట్టింది. గుడ్లు పెద్దవి చేసికొని ఆకాశంలోకి అదే పనిగా చూస్తూ ఉన్న చేప పిల్లను గమనించి తల్లి చేప అన్నది.

"ఏమిటమ్మా! అదేపనిగా ఆకాశంలోకి చూస్తున్నావు?"

"ఆకాశం చూడు.. ఎంత అందంగా ఉందో.."

"ఆకాశం అంటేనే అందం, ఆనందమూను! అందుకే పక్షులు కూడా అలా కేరింతలుగా ఎగురుతూ ఉంటాయి! పగటిపూట కదా.. వెలుగులో మబ్బులు మెరిసిపోతాయి"



"రాత్రి కూడా అందంగానే ఉంటుందమ్మా! పూలు విచ్చినట్లు నక్షత్రాలు ఆకాశంనిండా విప్పారి, ఎంత చూడముచ్చటగా ఉంటాయో!

"ఔను...ఆ ఆకాశం మన కొలనులో ప్రతి బింబిస్తూ ఉంటే ఆ తారకలన్నీ మన దగ్గరే ఉన్నట్లు ఉంటుంది"

"ఏమోనమ్మా! ఆ ప్రతిబింబాలను చూస్తే ఏం బావుంటుంది! ఆ ఆకాశంలోకి ఎగిరి, పిట్టలతో జట్టు కట్టి, మబ్బు పిల్లలతో ఆడుకుంటే, ఎంత బాగుంటుందో...నే చెప్పలేను...అమ్మా నేను ఎగిరి వేడతానమ్మ!"

"హమ్మో! అంతపైకి ఎగరడమే...ఎంత ప్రమాదమో, తెలుసా?"

"ఎందుకు ఎగరలేనూ...చూడు..."

-అంటూ ఆ చేప పిల్ల చటుక్కున నీళ్ల పైకి ఎగిరింది. తిరిగ నీళ్లల్లో పడి, చరచరా తల్లి వద్దకు దూసుకువచ్చింది.

"చూశావా అమ్మ, ఎంత బాగా ఎగిరానో"- అంది.

"ఎంత ఎగిరితే మాత్రం, మళ్లీ నీళ్లల్లోకి వచ్చి పడ్డావుకదా"

"ఇందాకా నేను బాగా ఎగరలేదు. నేను నా బలం కొద్దీ ఎగిరానంటే, ఒక్క ఊపులో ఆ మబ్బు దుప్పట్లు మీద వాలుతాను తెలుసా"?

"ఏమోనమ్మ నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి"- అంటూ తల్లి చేప వెళ్లిపోయింది. పిల్లచేత, ఆ పళంగా, తన శక్తికొలదీ నీళ్లపైకి ఎగిరింది. అయితే, ఈసారి అది నీళ్లల్లోకాక, పక్కన ఉన్న తుప్పల్లో పడింది. ఎటూ కదలలేకపోయింది. నీళ్లల్లో ఉన్నట్లుగాకాక, బయట దానికి ఊపిరి ఆడలేదు. డొక్కలు ఎగురవేస్తూ గిలగిలా తన్నుకొని చనిపోయింది!

అందుకే, తన శక్తికి మించిన పనిని, గర్వంతో చేయకూడదు! చేస్తే హాని కలుగుతుందని అంటాడు యోగి వేమన.

తామసించి చేయ తగదెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమ మగును-
పచ్చికాయ దెచ్చి పడవేయఫలమగునె
విశ్వదాభిరామ వినురవేమ !

# మనసు విరిగెనేని

పూర్వం పేరయ్య అనే పండితుడు ఉండేవాడు. అతడు చాలా పేదవాడు. ఆయవారాలు చేసుకొంటూ జీవిస్తూ- కొడుకును పెద్ద చదువులు చదివించాడు. ప్రభుత్వోద్యోగంలో చేరి కొడుకు మెట్టు మెట్టుగా పైకి వెళ్లి- చివరకు తహసీల్‌దార్ అయినాడు.

పేరయ్య పెద్దవాడైనాడు. భార్యతో కొడుకు వద్దనే ఉంటూ కాలక్షేపం చేస్తున్నాడు. పూర్వకాలపు మనిషి కావడంవల్ల, ప్రాయం వచ్చినప్పటినుంచీ కష్టజీవి కావడంవల్ల, పేరయ్య జీవిత విధానంలోను, వేషబాషల్లోను ఆధునికమైన మార్పులేమీ రాలేదు. ఆయవారాలు మానివేసినా విస్తళ్లు కుట్టుకోవడం, ఊళ్లో జరిగే శుభకార్యాలకు పెత్తనం నెత్తిని పెట్టుకొని పని చేస్తూ ఉండడం మొదలైన అలవాట్లతో అతడు వెనుకటి రీతిగానే ప్రవర్తిస్తూ ఉండేవాడు.

ఇలా రోజులు గడుస్తున్నాయి.

ఒకనాడు పేరయ్య ఇంటిముందు వసారాలో విస్తళ్లు కుట్టుకుంటూ



కూర్చున్నాడు. ఇంతలో ఓ పెద్ద అధికారి లోపలకు వచ్చాడు. తహసీల్ దారు ఆ ఆఫీసర్ తో మాట్లాడుతూ ఆ వసారా గుమ్మంలో నిలబడి ఉన్నాడు. మాటల మధ్యలో ఆ ఆఫీసరు "ఆ మూల కూర్చుని ఉన్నవారు ఎవరు"? అని అడిగాడు. తహసీల్ దారు "మా ఇంట్లో వంట మనిషి" అంటూ చిన్నగా నవ్వేశాడు!

కొడుకు అనిన మాటలు పేరయ్య చెవిన పడ్డాయి. ఎంతో కోపం వచ్చిందతనికి! గుండెల్లో అవమానం మంటలు రేగి భగ్గుమన్నాయి. చటుక్కున లేచాడు. చేతిలో ఉన్న ఇత్తడి చెంబుతో, లోపలికైనా వెళ్లకుండా భార్యను పిలిచాడు. "నేను వెళ్లిపోతున్నాను. నువ్వు వస్తున్నావా లేదా?" అన్నాడు. ఆమె తెల్లబోతూ "వెళ్లడమేమిటి? ఎక్కడికి?" అన్నది. "అది అంతా నీకు అనవసరం. నేను వెడుతున్నాను. వస్తున్నావా! లేదా!" అంటూ పేరయ్య వీధిలో కాలుపెట్టాడు. అది చూసి భార్య తన కట్టుబట్టలతో తానే పేరయ్యను అనుసరించింది.

అంతే పొరుగూరికి వెళ్లి సత్రంలో కాపురం పెట్టిన పేరయ్య వద్దకు వచ్చి బంధువులు, ఊరి పెద్ద మనుషులు ఎంత నచ్చచెప్పినా అతడు వినలేదు. "అష్టకష్టాలు పడి, పెంచి పెద్దను చేస్తే ఉద్యోగపు అహంకారంతో నేను వంట మనిషిలా కనపడ్డాను నా కొడుకుకు. నామనస్సు విరిగింది. ఇక అది అతకదు" అంటూ నిట్టూర్చిన పేరయ్య ఆ తరువాత ఏమైనాడో ఎవరికీ తెలియలేదు-అంతే!

ఇటువంటి సందర్భాన్ని చక్కగా వివరించాడు యోగి వేమన!

ఇనుము విరిగెనేని ఇనుమారుముమ్మారు
కాచి యతుకవచ్చు క్రమముగాను-
మనసు విరిగెనేని మరియతుకరాదయా
విశ్వదాభిరామ వినురవేమ!

# అల్పబుద్ధి

విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉండిన శ్రీకృష్ణ దేవరాయలవారు ఒకనాడు క్షౌరం చేయించుకొనవలెనని అనుకొన్నారు, ఆస్థాన క్షురకుని పిలువనంపారు. అతడు వచ్చేలోగా రాయలవారికి కొంచెం కునుకు పట్టింది. తాము కూర్చున్న కుర్చీలోనే నిద్రపోయారు.

కొంచెం సేపట్లో క్షురకుడు వచ్చాడు. నిద్రలో ఉన్న ప్రభువును లేపడం తప్పుకదా! ఏమి చేయడానికి అతనికి తోచలేదు. అయినా తన నేర్పు తీర్పులతో, రాయలవారికి నిద్రాభంగం కలగకుండానే గడ్డం గీసి వెళ్లిపోయాడు.

మరి కొంత సేపటికి రాయలవారికి మెలుకువ వచ్చింది. గెడ్డం చూసుకొంటే అంతా నున్నగా ఉంది. ఆయనకు ఆశ్చర్యం కలిగింది. తనకు మెలకువ రాకుండా క్షౌరం చేసినందుకు క్షురకుడిని పిలిపించి, అతని చాకచక్యాన్ని ఎంతో మెచ్చుకున్నారు. అతనికి ఏదైనా బహుమతి ఇవ్వదలచి, ఏమైనా కోరుకోమన్నారు. అతడు ఎంతో ఆనందపడి, తనను మంత్రిగా నియమించమన్నాడు. రాయలవారు సరేనని, క్షురకుని మంత్రి చేసి, అధికారాలను వప్పగించారు.

క్షురకుడు మంత్రిగా పరిపాలనను చేయడం ప్రారంభించాడు.



పరిపాలనలో ఖర్చు వెచ్చాలనన్నిటిని పరిశీలించి చూసే, రక్షణ బలాల కింద అవుతూ ఉన్న ఖర్చు అంతా వృధా అని అతనికి అనిపించింది. వెంటనే ఏనుగులను, గుర్రాలను, రథాలను అమ్మివేసి, ఆ శాఖలపై ఉన్న అధికారులను తొలగించివేశాడు. రాయలవారు ఇదంతా చూసి ఆశ్చర్యపోయారు. ఏమి జరుగుతుందో అని గమనిస్తూ ఊరుకున్నారు.,

కొన్నాళ్లు అయింది.

విజయనగర సామ్రాజ్యానికి రక్షణ బలాలు లేవని తెలిసిన శత్రురాజులు, విజయనగరం కోటను ముట్టడించాలని, సైన్యాలతో వచ్చి దగ్గర పొలిమేరలలోనికి చొరబడ్డారు. అది చూసి అందరూ భయపడ్డారు. వెంటనే రాయలవారు తిమ్మరుసు మహామంత్రిని పిలిపించి శత్రువులను ఎదుర్కొని కోటను రక్షించుకొనే ఉపాయం చూడమన్నారు. "ఏదో యుక్తిపన్ని శత్రువులను పారద్రోలాలి. గత్యంతరంలేదు. నేను చూసుకొంటాను ప్రభూ! అని చెప్పి తిమ్మరుసు వెంటనే ఓ లక్ష అరటి ఆకులను తెప్పించాడు. వాటిని, పులుసు, మజ్జిగ మొదలైన వాటితో తడిపి, ఉండలుగా నలిపి కోట అవతలకు విసిరివేయించాడు. కుప్పతెప్పలుగా వచ్చి పడుతున్న ఆ విస్తారాకులను చూసి "కోటలో లక్షలకొలదీ సైనికులున్నారు. వారిని జయించడం కష్టం" అని భావించి, శత్రురాజులు వెనుదిరిగి తమ సైన్యాలతో వెళ్లిపోయారు. మహామంత్రి తిమ్మరుసు యుక్తివల్ల విజయనగరం కోటకు మహా ఉపద్రవం తప్పిపోయింది. వెంటనే తెలివితక్కువ పనులు చేసిన క్షురక మంత్రిని మారుమాటాడకుండా ఇంటికి పంపించివేశారు.

విజయనగర సామ్రాజ్యాన్ని గురించి చెప్పుకొనే జానపద గాథలలో ఇది ఒకటి! ఇది నిజమైనా, కాకపోయినా బుద్ధి వికాసం లేనివానికి అధికారం వప్పగిస్తే వాటిల్లే ముప్పును గురించి ఈ కథ వివరిస్తుంది! అందుకే వేమన యోగి అన్నాడు.

అల్పబుద్ధి వానికధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల తొలుగగొట్టు
అల్పజాతి మొప్పె అధికులనెరుగునా
విశ్వదాభిరామ వినురవేమ!

# తప్పులెన్నువారు

అది ఒక పర్వత ప్రాంతం. అక్కడ ఉన్న ఒక కొండకు "ఒలీవకొండ" అని పేరు. ఏసుక్రీస్తు మహాశయుడు రోజూ ఆ కొండ వద్దకు వెళ్లి ప్రార్థన చేసికొని, దగ్గరలో ఉన్న ఓ దేవాలయానికి వెడుతూ ఉండేవాడు. ఒకనాడు ఏసు ఆ కొండ వద్ద నుండి గుడికి వెడుతూ ఉంటే ఒకామె గబగబా ఆయన వద్దకు పరుగెత్తుకొంటూ వచ్చింది. కొంతమంది రాళ్లతో కొట్టుతూ, తరుముకొని వస్తూ ఉంటే, ఆమె ఆయాసంతో ఒగుర్చుతూ, బాధతో ఏడుస్తూ వచ్చింది. ఆమెను ఏసు పలకరించబోయాడు. అంతలో ఆమెను తరుముకొని వస్తూ ఉన్న వారంతా "కొట్టండి! చంపండి" అని అరుస్తూ అక్కడకు చేరారు.

ఆవేశంతో ఊగిపోతూ, క్రూరంగా అరుస్తూ ఉన్న వారిని చూసి "ఎందుకు ఆమెను కొడుతున్నారు?" అని అడిగాడు.

"ఆమె కులట...వేశ్య...అన్నారు వారు.

"అయితే ఆమెను చంపాలా?" అన్నాడు ఏసు!



"సంఘంలో చెడబుట్టిన ఆమెను చంపాలా? చంపిపాతెయ్యాలా! ఆమె మహాపాపి! పాపం చేస్తూ ఉండగా చూసి, ఆమెను పట్టుకున్నాం. పాపం చేస్తూ సంఘాన్ని పాడు చేస్తూ ఉన్న వాళ్లను బతకనియ్య కూడదు" అంటూ వారందరూ మళ్లీ రాళ్లు తీసి ఆమెను కొట్టబోయారు.

అంతలో ఏసు "ఆగండి! ఆగండి! అయితే ఒక్కమాట అడుగుతాను చెప్పండి. ఆమె మహాపాపం చేసిందని అంటున్నారు. సరే! అయితే, ఏపాపమూ చేయనివాళ్లకే ఆమెను కొట్టే అర్హత ఉంటుంది. ఇది తెలుసుకోండి. కనుక మీలో పాపం చేయని వాళ్లు ఎవరైనా ఉంటే, రాయి పుచ్చుకొని ఆమెను కొట్టండి." అన్నాడు. అంటూ అక్కడి వారినందరినీ ఓసారి తేరిపారచూసి, కళ్లుమూసుకొని కూర్చున్నాడు ధ్యానం చేసుకుంటూను.

-ఏసు మాటలు విని వారందరూ తెల్లబోయారు. ఒకరి మొహాలు మరొకరు చూసుకొన్నారు. కొంచెం సేపట్లో వారి చేతులలో ఉన్న రాళ్లు జారి కింద పడిపోయాయి. ఆలోచనలతో నిండిన వాళ్ల కళ్లు మూతలు పడిపోయాయి. అందరూ తలలు వంచుకొన్నారు.

మరికొంత సేపటికి ఏసు కళ్లు తెరిచి చూసేసరికి అక్కడ ఒక్కడూ లేడు! తప్పులు చేసినవారు పశ్చాత్తాపంతో వెనుదిరిగి వెళ్లిపోయారు.

తప్పులు చేయనివాళ్లు ఎవరుంటారు! అందరూ ఏవేవో తప్పులు చేస్తూనే ఉంటారు. చిత్రమేమంటే, ఎదుటివారి తప్పులను ఎన్నుతూ ఉంటారేగాని, వారు, తమ తప్పులను మాత్రం ఎంచుకోరు!

అందుకే వేమన యోగి అన్నారు.

తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్వ్విజనులకెల్లనుండు తప్పు
తప్పులెన్నువారు తమతప్పులెరుగరు
విశ్వదాభిరామ వినురవేమ!

# గుణహీనుడు

రాజరాజు అయిన దుర్యోధనుడు కురుకుల సార్వభౌముడు! రాజులకు రాజుగా భరతఖండాన్ని ఏలిన అతడు మహాభారత కథలో పరమదుష్టుడుగా ప్రసిద్ధుడైనాడు.

అన్నదమ్ముల వైరానికి మూలకారకుడయ్యాడు. పినతండ్రి బిడ్డలు, సోదరులు అయిన పాండవులను మట్టుపెట్టడానికి అతడు చేసిన అకృత్యాల చరిత్రే మహాభారత గాథ!

పాండురాజు కుమారులైన ధర్మరాజ సోదరులకు, రాజ్యంలో సగభాగం ఇవ్వకుండా వారిని వంచించాలని అతడు ప్రయత్నించాడు. కుట్రలతో, కుచ్చితమైన ఎత్తులతో పాండవులను చంపివేయాలని ప్రయత్నించాడు. దుర్యోధనుని చర్యలు మహాభారత యుద్ధంగా పరిణమించాయి.

సామ్రాజ్యంలో అర్థభాగాన్ని కోరిన పాండవులను నాశనం చేయాలనుకున్నారు. దుర్యోధనుడు వారున్న లక్క ఇల్లును తగులబెట్టించాడు. మాయా జూదానికి ధర్మరాజును ఆహ్వానించి మాయ ఎత్తులు వేసి, జూదంలో ధర్మరాజును ఓడించాడు. అతని



సర్వస్వాన్ని వశం చేసికొన్నాడు. చివరకు పాండవుల ధర్మపత్ని ద్రౌపదిని కూడా మాయజూదంలోనెగ్గి, ఆమెను నిండుసభలో అవమానించాడు. జూదం నియమాల ప్రకారం పాండవులను అరణ్యవాసానికి, పిమ్మట అజ్ఞాతవాసానికి పంపి, వారిని నానా హింసలు పెట్టాడు.

ఈ దాయాదుల పోరును ఎలాగైనా తప్పించాలని, పాండవులు, తమకు అర్ధరాజ్యానికి బదులుగా ఐదు ఊళ్లు ఇచ్చినా చాలునన్నారు. అయినా దుర్యోధనుడు సూది మోపినంత స్థలం కూడా ఇవ్వనని మొండిగా చెప్పేశాడు. కురు, పాండవుల మధ్య సఖ్యత నేర్పరచాలని, భీష్మ, ద్రోణ, కృపాచార్యులు మొదలైన కురువృద్ధులు చేసిన ప్రయత్నాలను కూడా దుర్యోధనుడు తిరస్కరించాడు. తుదకు ఆ కృష్ణుడు రాయబారిగా వచ్చి, కౌరవ సభలో సంధి మాటలను చెప్పినప్పటికీ వినక కృష్ణుని త్రాళ్లతో కట్టివేసి అవమానించాలని కూడా దుర్యోధనుడు కుట్ర చేశాడు! ఫలితంగా మహాభారత యుద్ధం జరగక తప్పలేదు! అందు కౌరవులు, భీష్మాది మహా పురుషులు, అందరూ పాండవవీరుల చేతిలో పరాభూతులై మరణించారు.

నూర్గురు సోదరులతో కూడిన కౌరవ వంశం మహా సంపన్నమైన హస్తినాపుర సామ్రాజ్యం దుర్యోధనుని దుష్టబుద్ధివలన సర్వనాశనమైనవి. అతడు పెంచుకొన్న పగ, అసూయ, ద్వేషం మొదలైన దుర్గుణాలు అతని నాశనానికే దారి తీశాయి.

గుణహీనుడైన ఒకని కారణంగా కౌరవ కులమంతా ఎలా నాశనమైందో మహాభారత కథ వివరిస్తుంది. అందుకే వేమనయోగి అన్నాడు.

కులములోన నొకడు గుణహీనుడుండు
కులము చెడును వాని గుణము వలన
వెలయు చెరకునందు వెన్నువెడలి
విశ్వదాభిరామ వినురవేమ!

# పైసా అప్పు

అనగనగా ఓ ఎలక...ప్రొద్దున్నే దానికి ఎంతో ఆకలి వేసింది. చిట్టడవి అంతా తిరిగింది. కాని దానికి, తినడానికి ఏమీ దొరకలేదు. "తిందామంటే ఏమీ లేదు. పోనీ, ఏదైనా కొనుక్కొని తిందామంటే, ఒక్క పైసా అయినా లేదు. ఏమి చెయ్యాలి?" అనుకొంటూ నీరసంగా ఓ చెట్టు కింద కూర్చుంది.

అంతలోనూ భూదేవి అక్కడకు వచ్చింది. నీరసంగా పడి ఉన్న ఎలకను చూసి "ఎలకమ్మా! ఎలకమ్మా! అలా కూర్చున్నావేం?" అని అడిగింది. భూదేవిని చూడగానే ఎలకమ్మకు ఎంతో ధైర్యం వచ్చింది. "ఆకలేస్తోంది. తినడానికి ఏమీ దొరకలేదు. ఓ పైసా అప్పు ఇయ్యి. ఏదైనా కొనుక్కొని తింటాను. నీ పైసా రెండు రోజుల్లో ఇచ్చేస్తాను" అంది ఎలకమ్మ. భూదేవికి జాలి వేసి ఓ పైసా ఇచ్చింది. ఎలకమ్మ ఆ పైసా తీసుకుని, ఆనందంతో పరుగెత్తింది. ఆ పైసాతో పప్పులు కొనుక్కొని తినేసింది. ఆకలి తీరగానే హాయిగా అడవి అంతా తిరిగేసింది. గంతులు వేస్తూ-!

ఆకలి తగ్గింది. అవసరం తీరింది. ఆనందంతో ఎలకమ్మ అంతా



మరచిపోయింది. అయితే రెండు రోజులైన తరువాత భూదేవి వచ్చింది పైసాకోసం. భూదేవిని చూడగానే ఎలకమ్మకు పైసా బాకీ విషయం జ్ఞాపకం వచ్చింది. సరేలే అనుకొని "ఓ వారం రోజుల్లో నీ అప్పు తీరుస్తానులే" అంది ఎలకమ్మ. "భూదేవి అలాగే ఇయ్యి" అని వెళ్లిపోయింది.

సరిగ్గా వారం దాటాక భూదేవి మళ్లీ వచ్చింది. ఎలకమ్మకు కొంచెం కోపం వచ్చింది. వారం అంటే, సరిగ్గా వారానికే రావాలా ఏమిటి? నాకు రావలసిన సొమ్ము రాలేదు. వచ్చాక ఇస్తాను, ఓ నెల పోయాక" అంటూ చురచురా చూస్తూ వెళ్లిపోయింది ఎలకమ్మ!

మళ్లీ నెల్లాళ్లకు వచ్చి భూదేవి తన అప్పు తీర్చమని అడిగింది ఎలకమ్మను! 'మరో రెండు నెలలు దాటాకరా' అంటూ ఎలకమ్మ వెనకకైనా చూడకుండా వెళ్లిపోయింది! ఇలా భూదేవి రావడము, ఎలకమ్మ ఏదో సాకు చెప్పి వెళ్లిపోవడము- చాలాసార్లు జరిగింది. పైసా బాకీ తీర్చకుండా ఎగవేద్దామనే ఎలకమ్మ ధోరణి కనిపెట్టి, భూదేవి, తనను ఎప్పుడు ఎలకమ్మ రమ్మంటే అప్పుడు వచ్చింది. చివరకు ఓనాడు భూదేవి వస్తూ ఉండడం కనిపెట్టి ఆమెకు కనపడకుండా ఉండాలని ఎలకమ్మ ఓ గుట్టమీదికి పారిపోతూ ఉంటే కాలుజారి కిందకు జారింది. భూదేవి, అంతలో వచ్చి ఎలకమ్మను పట్టుకొని కాపాడింది. భూదేవిని చూసి, ఎలకమ్మ సిగ్గుతో తలవంచుకుంది. అది చూసి భూదేవి అన్నది "ఎలకమ్మా! అప్పులు చేయకూడదు. చేస్తే తీర్చకుండా ఉండకూడదు. చూడు నాకు కనపడకుండా పారిపోవాలంటే, ఎక్కడికి పోగలవు ఈ భూమిమీద? భూమిలేని తావులేదుకదా! ఈ భూమిలాగే నీవు చేసిన అప్పు తీర్చేదాకా నిన్ను వెంటాడుతుంది" అంటూ నవ్వింది. ఎలకమ్మను ఓదార్చి "అప్పులు ఎగవేయడానికి ఎప్పుడూ ప్రయత్నించకు. అప్పు అంటే అప్పే! అది తీర్చకుంటే ఎప్పటికైనా ముప్పే!" అంటూ వెళ్లిపోయింది భూదేవి. అందుకే వేమన యోగీంద్రుడు అన్నాడు:

అప్పు చేయుటన్న తప్పదేవరికైన
అప్పు చేయుటన్న తప్పుకాదు
అప్పు తీర్చకున్న ముప్పులు ముంచురా
విశ్వదాభిరామ వినురవేమ!

# మేడిపండు

ఒక ఊరిలో సోమయ్య అనే యువకుడు ఉన్నాడు. అంగలోపంవల్ల ఎక్కడికైనా వెళ్లి ఏపనీ చేసి ఏమీ సంపాదించు కొనలేక - అతడు ఎంతో బాధపడుతూ ఉండేవాడు. ఆ బాధలు తొలగి పోవాలంటే "ఏం చెయ్యాలి?" అని ఆలోచించగా - అతనికి ఒక ఉపాయం తోచింది.

వెంటనే ఊరిబైట దారి మలుపులో ఉన్న మర్రిచెట్టు కింద నీడలో చాపపరుచుకుని, పెద్ద చేపాటి కర్రచేతిలో పెట్టుకొని కూర్చున్నాడు. పొరుగూరికి పొలాలకు పోయే దారి కావడం వల్ల- చాలామంది అటూ ఇటూ వస్తూ పోతూ ఉండేవారు. వాళ్లనుచూసి సోమయ్య - "మీదగ్గర ఉన్న సొమ్ము అక్కడ పెట్టండి లేకపోతే.. ఇదిగో, చూశారా ... ఈ కర్రతో బాదేస్తాను తెలుసా? నేను లేస్తే మనిషినికాను ... వొళ్లూపైనా తెలియకుండా కొట్టేస్తాను... నాకు కోపం తెప్పించకుండా మీ దగ్గర ఉన్నది అక్కడ పెట్టి వెళ్లండి"



అంటూ - ఆక్రోశతో నేలమీద దబదబా బాది, బెదిరిస్తూ ఉండేవాడు.

కండలు తిరిగిన చేతులు, శరీరము - అతనిని చూసి, భయపడి, ఆదారిని వెళ్ళేవాళ్లు అంతో ఇంతో అతనికి ఇచ్చి, గౌరవంగా వెళ్ళిపోతూ ఉండేవాళ్ళు.

ఇలా కొన్నాళ్లు గడిచాయి.

సోమయ్య పోరు, ఆ చెట్టు దగ్గర, రోజురోజుకూ పెరిగిపోతూ ఉంది. అందరికీ అతని బాధ ఎక్కువైపోయింది. చివరకు కొంతమంది కలిసి, తమలో తాము కూడ బలుక్కొని - "ఈ సారి సోమయ్య దబాయించి, భయపెట్టినట్లయితే - వాడిపై పడి చితకతన్ని పోదాం" అని నిర్ణయించుకొన్నారు.

ఆరోజున సోమయ్య మామూలుగా దబాయించడం మొదలు పెట్టాడు. "డబ్బులిస్తారా, లేదా! నేను లేస్తే మనిషినాకాను" అంటూ సోమయ్య అన్నాడో, లేదో - ఆ పదిమందీ అమాంతంగా వానిపై పడి, కొట్టడానికి సిద్ధమైనారు. సోమయ్య లబోదిబోమంటూ - "నేను చెప్పింది అబద్ధం కాదు. నేనే లేస్తే మనిషినికాను - అన్నమాట నిజం. నా రెండు కాళ్ళు చచ్చుబడిపోయాయి. చూడండి" అన్నాడు వారంతా సోమయ్యను చేతులతో ఎత్తి నిలబెట్టపోతే, అతని రెండు కాళ్లూ కాడల్లా వ్రేలాడి, నిలబడలేక అతడు క్రింద కూలబడిపోయాడు. అదిచూసి, అందరికీ ఆశ్చర్యం కలిగి- "ఇదా నీదబాయింపులోని రహస్యం! నీ కండలు, దండలు చూసి, నువ్వెంత వీరుడవో అనుకొన్నాం. నీ అసలు రూపం ఇదన్నమాట" అంటూ "వీడు పైకి శాండోలాగ కనపడతాడు గాని - లోపల పిరికి పింజేరా ..." అంటూ నవ్వుకొంటూ వెళ్ళి పోయారు-

ఇలాంటి వారిని చూసి - వేమనయోగి అన్నాడు.

మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడ పురుగులుండు -
పిరికివాని మనసు బింకమీలాగురా
విశ్వదాభిరామ, వినురవేమ!